క॥ కనుమూసినంత లోపల
వనరాశినిదాటివేగ వరజనకసుతన్
గనుగొనిదనుజుల ద్రుంచియు
ఘనవార్తనుదెచ్చినట్టి ఘనుడవుహనుమా॥ 14

క॥ పాలింపుము నామనవిని
జాలింపుముకోపమేల సత్కృపతోడన్
దేలింపు సౌఖ్యవార్ధిని
గాలింపుభవాబ్ధినెల్ల కూర్మిహనుమా॥ 15

క॥ సౌమిత్రియు మూర్ఛిల్లగ
కనులాప్పునురాకముందె ఘనద్రోణగిరిన్
శ్రమదీర్పగెచ్చి తౌరా
ఘనమగునిమహిమనెన్న కపివేహనుమా॥ 16

క॥ కోపినిదుష్టుడ జడుడను
పాపినిదురహంకృతుండ భ్రష్టుడనన్నున్
గాపాడ దిక్కునీవే
పాపహరావాయుపుత్ర భాసురహనుమా॥ 17

క॥ లంకనుగనివొచ్చి వెసన్
లంకాధిపువనముబెరికి లంఘిణిగూల్చన్
లంకేశుడంపు దనుజుల
లంకించుకగొట్టినావు లావుగహనుమా॥ 18

క॥ పదియేవురు కపులుండగ
వెదకినినుఁ సీతనెమక వేయనిబంచెన్
సదయుండౌ కాకుత్స్థుడు
ముదమున నీవెంత పుణ్యమూర్తివో హనుమా॥ 19

క॥ సింధువు గాంచియు వనచరు
లందరు భీతిల్ల జూచి యామైథిలికై
పొంగి జనియెద మీఁదగు
సందేహములుడుగుడన్న సామివి హనుమా॥ 20

క॥ రాగంబాదిగ గుణముల
త్యాగంబొనరించినన్ను నాగమువిధిగా
యోగివిగా భోగివిగా
సాగరగంభీర జేయు శరణిడె హనుమా॥ 21

క॥ పవనాత్మజ నీ నామము
సవినయముగ నెవ్వరేని సాగిలిపలుచున్
భువి నొక్కసారి దలచిన
భవదోషములణగునండ్రు ప్రాజ్ఞులు హనుమా॥ 22

క॥ హనుమంతా హనుమంతా
హనుమంతా వాయుపుత్ర యఘుజనవినుతా
హనుమాయని నినుదలచిన
ఘనదుఃఖము బాపజాలు ఘనుడవు హనుమా॥ 23



శ్రీగురుభ్యోనమః

# హనుమచ్ఛతకము.

ఇది

గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా

పెసపాడు గ్రామ నివాసుడగు

పీసపాటి కోటీశ్వరశర్మచే రచియింపఁబడియె.

౨౫౦ ప్రతులు.

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు

కే. బి. కృష్ణారావుచే

ముద్రింపఁబడియె.

1914



విబుధవర్యులారా ?

యొకచిన్ని విజ్ఞాపన.

చ॥ సరసపదార్థసంగ్రహణసఖ్యముసొంచుబ్రకాశమొందుచున్
సురుచిరవాగ్విభూతిగడుశోభితమై దనరారుచుండుటన్
తిరముగసత్కవీశ్వరుల దిన్నని ప్రోక్తముగాదిదంచు వ
క్కరములుబూని దీని స్తనశల్యములన్నినగూర్చబోకుడీ॥

గీ॥ అనిలసుతుపాద పద్మంబు లందుభక్తి
తోడ నీపద్యరాజినిదోచినటుల
గూర్చితిని మన్ననమునచేకొనుఁడుయిద్ది
భవ్యమతులార సత్కవిప్రౌఢులార॥

ఇట్లు సుజనవిధేయుడు,
☞ పీసపాటి కోటీశ్వరశర్మ.



శ్రీవేంకటేశ్వర సమర్థ.

# హనుమచ్ఛతకము

క॥ శ్రీవసుధాత్మజవరు పద
సేవన్మెప్పించి తత్వసిద్ధుడవౌని
శేవకుడను నుతియించెద
బ్రోవుమునను పీసపాటి పురవరహనుమా॥ 1

క॥ మద్గురుడగు శ్రీవేంకట
సద్గురునినుతింపదలచి సరసంబొప్పన్
హృద్గతమౌపద్య త్రయ
వర్గములన్గూర్చి పిదప వనచరహనుమా॥ 2

క॥ ఒకరోజున నేనిద్రను
ప్రకటితముగనెందువేళ భాసురమొప్పన్
నొకయతిరూపున గన్పడి
యొకసంగతిదెల్పెనౌర యోహరిహనుమా॥ 3

క॥ కేసరిపుత్రుని పేరట
భాసురమొప్పగను కందపద్యములుదగన్
చేసి లిఖితముగ వ్రాయుత
శాస్త్రనియతి దృశ్యమున జెందె నౌరాహనుమా 4

క॥ దిబ్బన మేల్కొని నేని
దబ్బము వ్రాయగ దలంచి గారవ మొప్పన్
యుబ్బు మది సంతసించితి
శబ్బర లేకుండ గూర్ప జేయుము హనుమా॥ 5

క॥ సాధువరా వేంకట ప్రభు
సాధుపదాబ్జంబు లెదను సంభ్రమ మొప్పన్
పాదుగ నిల్పియు గూర్చితి
గాథలు వేరొండు బల్కగా దిక హనుమా॥ 6

క॥ ధర వేంకటప్ప యార్యుని
చరితరుశియు సుబ్బమాంబ వనితాత్మజుడన్
కరుణించు కోటయార్యుడ
తరుచరనను వేరు సేయ దగదిక హనుమా॥ 7

క॥ కవితాలక్షణ మేమియు
సవినయముగ నెఱుగనీదు సత్కృపవలనన్
కవి గూర్చితి కందంబులు
కవివరులకు మ్రొక్కులిడుచు ఘనముగ హనుమా॥ 8

క॥ కరుణాకర రక్షింపుము
శరణార్థిని నేరములను జర్చిం[illegible]న
దురితముల బారదోలుము
వరదాపీస్పాటి పురనివాసాహనుమా॥ 9

క॥ సరసోక్తుల నినుదలచిన
నరులకుభవహారమటంచు నార్యులనిరి హా
పరమాత్మ నిన్ను జేరితి
వరదాపీస్పాటి పురనివాసాహనుమా॥ 10

క॥ భవబంధము లణగించును
పవనజనీనామమంత్ర పఠనంబనుచున్
దవిలివచింతురు ప్రాజ్ఞులు
భువనాత్మకపీసపాటి పురవరహనుమా। 11

క॥ వందనము దళితదనుజా
వందనముపతంగ తేజ వనచరరాజా
వందనము మారుతాత్మజ
వందనమిదెపీసపాటి వరగుణాహనుమా॥ 12

క॥ మ్రొక్కెద మీరూపమునకు
మ్రొక్కెదమీపాదములకు ముదముదలిర్పన్
మ్రొక్కెద మీ తేజమునకు
మ్రొక్కిన మ్రొక్కులనుగొనుము ముదమునహనుమా॥ 13

క॥ కనుమూసినంత లోపల
వనరాసినిదాటివేగ వరజనకసుతన్
గనుగొనిదనుజుల ద్రుంచియు
ఘనవార్తను దెచ్చినట్టి ఘనుడవుహనుమా॥ 14

క॥ పాలింపుము నామనవిని
జాలింపుముకోపమేల సత్కృపతోడన్
దేలింపు సౌఖ్యవార్థిని
గూలింపుభవార్థినెల్ల కూర్మినిహనుమా॥ 15

క॥ సౌమిత్రియు మూర్ఛిల్లగ
కమలాప్తుడు రాకముందె ఘనద్రోణగిరిన్
శ్రమదీర్పదెచ్చి తౌరా
ఘనమగునిమహిమనెన్న కపివేహనుమా॥ 16

క॥ కోపినిదుష్టుడ జడుడను
పాపినిదురహంకృతుండ భ్రష్టుడనన్నున్
గాపాడ దిక్కునీవే
పాపహరావాయుపుత్ర భాసురహనుమా॥ 17

క॥ లంకనుగనిచొచ్చి వెసన్
లంకాధిపువనముపెరికి లంఘించిగూల్చన్
లంకేశుడంపు దనుజుల
లంకించుకగొట్టినావు లావుగహనుమా॥ 18

క॥ పదియేవ్వురు కపులుండగ
వెదకినిన్నె సీతనెమక వేయనిబంచెన్
సదయుండౌ కాకుత్స్థుడు
ముదమున నీవెంతపుణ్య మూర్తివో హనుమా॥ 19

క॥ సింధువు గాంచియు వనచరు
లందరుభీతిల్లజూచి యామైథిలికై
పొందుగజనియెద మీదగు
సందేహములుడుగుడన్న స్వామివి హనుమా॥ 20

క॥ రాగంబాదిగ గుణముల
త్యాగంబొనరించినన్ను నాగమవిధయా
యోగివిగా భోగివిగా
సాగరగంభీర జేయు శరణిదె హనుమా॥ 21

క॥ పవనాత్మజ నీనామము
సవినయముగ నెవ్వరేని సాగిలిబడుచున్
భువినొక్కసారి దలచిన
భవదోషములణగునంద్రు ప్రాజ్ఞులు హనుమా॥ 22

క॥ హనుమంతా హనుమంతా
హనుమంతా వాయుపుత్ర యఘజనవినుతా
హనుమా యని నినుదలచిన
ఘనదుఃఖము బాపజాలు ఘనుడవు హనుమా॥ 23

క॥ పరగఁ బుట్టిన నాఁడే
సరసిజహితుగాంచియెంతో సంబరమునయం
బరమున కెగసిన నీకుఁ
సరివారలుగలరె తెలియ జగతినిహనుమా॥ 24

క॥ పరమేష్టినిన్ను గాంచియు
పరగఁ మదిసంతసించి భాసుర మొప్పఁ
వరములనిచ్చెఁ గాప్రస
న్నురుడునుసదృశుండుగలడె యుర్వినిహనుమా॥ 25

క॥ కరమమృతము గ్రోలినయా
సురలకునమరత్వమబ్బె సుస్థిర మొప్పన్
అరలేనిభక్తి చేతను
యరయగనమరత్వమంది తౌ రాహనుమా॥ 26

క॥ రవిజునకును రవికులునకు
నవిరళస్నేహము నొసఁగి యావాలిని నీ
వవనిఁ గూల్పించితివా
దవిలివచింపగనువశమె ధరలోహనుమా॥ 27

క॥ కాటుకపక్షుల రెంటిని
నూటిగ భ్రూమధ్యమందు సుస్థిర మొప్పఁ
పాటించిదృష్టి జూచిన
హాటకతేజంబునీవె మహా రాహనుమా॥ 28

క॥ నిగ్రహానుగ్రహములుగల
భర్గుడవని సంతతంబు భాగొప్పమదిన్
యుగ్రుడవనుచును నమ్మితి
యగ్రునిగా జేయుమయ్య నవనినిహనుమా॥ 29

క॥ లంకకు జనిమైథిలిగని
లంకాధిపుగాంచికొన్ని లాలితయుక్తిన్
లంకెలుగి దెల్పివిదపను
లంకాపురిగాల్చినావు లావుగహనుమా॥ 30

క॥ చందురు డుదయంబాదిన
సింధువుసదృశంబునరయ సింధువుకరణిన్
పొందుగనీసరి దైవము
యెందైనన్‌గలడె వెదుకనిలలోహనుమా॥ 31

క॥ మొండిగ్రహ దండిగ్రహ
ఛండిగ్రహసమితినిన్ను స్మరియింపంగా
బెండువడి పారకనుకల
నుండునె నినునుడువజనవె నుర్విని హనుమా 32

క॥ హరువీర్యంబున వసుధన్
హరివై జన్మించినావు యటుగాకున్నన్
హరికుల సంభవునకు నీ
హరిమహిమలుగలవె తెలియహరి శ్రీహనుమా॥ 33

క॥ శ్రీపీసపాటి పురమున
ప్రాపైయున్నట్టి రాముభక్తాగ్రజనన్
గాపాడ దిక్కునీవే
పాపహరావాయుపుత్ర భాసురహనుమా। 34

క॥ రోగముల నెల్లఁగాపి ని
రోగినిగా జేసినన్ను బ్రోవకయున్నన్
బాగుగ దెల్పెద వినుమీ
నీగురుపాదంబులాన నిజముగహనుమా॥ 35

క॥ హరివంశోద్భవ నీసరి
హరివంశోద్భవులుగలరె నాలోచింపన్
హరియైన దశరథాత్మజు
కరుణకునెలవైతిగాన ఘనుడవుహనుమా॥ 36

క॥ నినుజేరని దుష్టులకును
నీనామస్మరణమొప్పదు నిక్కమువిషమా
నిన్ననిశము స్మరియించెదు
మనుజనకమృశోప మానవారాహనుమా 37

క॥ శరనిధియుగట్టి లంకకు
అరయన్ నరహరినిజేర్చి కదనమునందున్
సురవైరి నమృతకలశము
శిరముగ్గార్పించినట్టి శ్రేష్ఠుడహనుమా॥ 38

క॥ స్థిరమౌమానసముస సు
స్థిరులై నినుదలపనట్టి జీవన్ముక్తుల
ట్లురయున్ నిరుపమసౌఖ్యము
పరగొస్ జెందుటకువశమె శవనజహనుమా. 39

క- చేసితి దుష్కర్మంబులు
జేసితి సాధులనునింద చెవిమొగ్గివినన్
జేసిన నేరము లెంచకు
భాసురపీస్పాటిపుర ప్రభాకరహనుమా. 40

క- దురమున దైత్యులగూల్చిన
శరణిని నానేరములనుఖండించి వెసన్
పరగన్ విపులసుసౌఖ్యము
సిరులిచ్చియు బ్రోవుమయ్య శ్రీహరిహనుమా. 41

క- అరయగ భువిసదృశంబగు
పరగ సువర్చలయనేటిపతివ్రతతోడన్
నిరుపమ సౌఖ్యముజెందెడి
కరుణాకర.నన్ను బ్రోవు ఘనుడవుహనుమా. 42

క- భవభంజన నీనామము
నవనిన్ స్మరియింపు జనులయఘబృందంబుల్
దవిలి బరిష్కృతి జేసెడి
భువనాత్మక పీసపాటిపురవరహనుమా. 43

క- మీకథలుండెడి దనుకను
శోకతో భువితనువునిల్పు సూత్రము రామా
ప్రాకట మీపదభక్తిని
నాకొసగుమియనవె వాయునందనహనుమా. 44

క- క్రమ్మర భువిపరిపాలన
తమ్ముల మిత్రులను బంధుతతిగనుటయు స
త్యమ్ముగ మారుతిసాహా
యమ్మనికాకుత్స్థుడనడె నవనినిహనుమా. 45

క- శూరత్వంబున భానుని
జేరియు వినయోక్తిగాను జెప్పుచ మాటల్
ధీరతతో ఘనచదువులు
శూరుడవై జదివినట్టి వీరాహనుమా. 46

క- నినుబోలుపుత్రు నిద్ధర
ననయముగను యమ్మనెన్న నలువకుదరమా
తనయులుగల్గిన నేమిల
తనయుడవీవె సుకీర్తి తనయాహనుమా. 47

క- కేసరి వరపట్టిని భువి
భాసురపీస్పాటిపుర ప్రభాకరతేజున్
వాసిగ నాహ్వాజ్జలజని
వాసమునన్ జేర్చిగొల్తు వరగుణాహనుమా 48

క- ననుబోలెడి కలుషాత్ముడు
జనియించడు నిక్కమెప్పుడు జగతీస్థలిలో
నిను జేరితి భవమృతులను
ఘనమౌ బాధలకు వెరచి గావుముహనుమా. 49

క- రారా నుతసంక్రందన
రారా సంపూర్ణరాజ రాజితవదనా
రారా ననుబ్రోచుటకై
రారా హరితనయ వేగ రారా హనుమా. 50

క- భూతాత్మక భూతాలయ
భూతోద్భవ భూతహరణ భూతాతీతా
భూతేశ్వర నినుజేరితి
ఖ్యాతిగ కృపనేలుమయ్య కరుణనుహనుమా. 51

క- ఓమర్కట రాణ్మిత్రా
యోమానిత సచ్చరిత్ర యోశుభగాత్రా
యోమారుత వరపుత్రా
యోమైథిలిదుఃఖహర్త యోహరిహనుమా॥ 52

క॥ నీసంగరవిజయంబును
నీసాహసవిక్రమమును నీనిపుణతయుఁ
నీసాత్వికగుణమెన్నను
వాసిగ శేషాహికైన వశమాహనుమా॥ 53

క॥ జోహారుమంజుభాషణ
జోహారి పుడార్తిహరణ సుందరచరణా
జోహారు దాసరక్షణ
జోహారి దేవనన్ను బ్రోవు జోజోహనుమా॥ 54

క॥ కాముని బోలిన దుర్భర
కామాంధత దగిలి యన్యకాంతలపొందుల్
కామింపునట్టిదుష్టుడ
కామాంతక నెటులనన్ను గాతువొ హనుమా॥ 55

క॥ ఇతరేతరానులాపము
లతులితభజనను మొనర్చు యాపాపాళిన్
క్షితిదుర్గతి జెందించియు
పతితులరక్షించునట్టి భర్గాహనుమా॥ 56

క॥ పంచాననసమశౌర్యా
సంచితములుద్రుంచి బ్రోవు శరణంచునుని
పంచను జేరితి పవనజ
యంచితముగ బ్రోవుమయ్య యఘహరహనుమా॥ 57

క॥ నిరతము మిము శేవించెడు
నరునకు యముడన్న నడరు నాత్మనుగనునా
వరగజము నెక్కునాతడు
ధరశ్వానముగరచునంచుదలచు నెహనుమా॥ 58

క॥ సామీరీ సంతతమును
పామరులఁ బ్రోచునట్టి భర్గుడవనుచున్
నీమముగానినునమ్మితి
కామాదులనణచిగావు కరణనుహనుమా॥ 59

క॥ ధీరత్మైరావణునిన్
నారకదునుమాడి యతని వరజామాతన్
ధారుణినేలగ జేసిన
వీరుడవనినమ్మినాడ వేడ్కతోహనుమా॥ 60

క॥ పరభామల పరధనముల
నిరతముహరియింపగోరు నీచమనముత్వా
చ్ఛరణంబను వరతరువున
కరుణన్ బత్తియను త్రాట గట్టుముహనుమా॥ 61

క॥ పనిబడి తొలిజన్మంబున
కనికానక జేసినట్టి ఘనపాపంబుల్
ఘనునై ననిచ్చునైనను
ననయము బాధించుననుచు యనవేహనుమా॥ 62

క॥ కర్మంబున నిలజన్మము
నిర్మితమౌననిరిబుధులు నేనీధరలో
నిర్మారణమొందనపుడా
కర్మంబేకరణిగల్గె కపివరహనుమా॥ 63

క॥ మితకాలము నీ మృత్యువు
మితిలేకను బాలునైన మేదినిలోనన్
సతతము దిరుగుచు చేకొను
నతులితముగ బ్రోవుమయ్య యఘహరహనుమా॥ 64

క॥ కపివరశరణంటినినా
యపరాధము బాపుమంటి సరిహరివంటిన్
నెపమెన్నగ రాదంటిని
నిపుణతకృప నేలుమంటి నిత్యముహనుమా॥ 65

క॥ క్రతువును దానముధర్మము
సతతముయుపవాసశౌచ సత్క్రియలెల్లన్
అతులితరామస్మరణకు
హితవుగ సరిగావటంచు నెంచినహనుమా॥ 66

క॥ దుర్భరసంసారగుహా
గర్భముచిజ్జడముగాను గాంచియుపిదపన్
గర్భముకనకముదాల్చిన
నిర్భయుపద శేవజేయు నిత్యుడహనుమా॥ 67

క॥ దారాసుతతలిదండ్రులు
వారక బాంధవులుమిత్ర వర్గములెల్లన్
కూరిమి నెంచగ దుఃఖపు
వారిధిగా నెంచినట్టి వాడవుహనుమా॥ 68

క॥ నిత్యానిత్యములరసియు
సత్యంబగురాముపదమె సత్యంబనుచున్
వ్యత్యయమెరుగౌఘను
సత్యంబని తెలిపినట్టి సామివిహానుమా॥ 69

క॥ ఇహపరభోగములందున
విహితం. . . యుక్తి లేని విధమనుచుమరిన్
యిహపరభోగవిరాగము
విహితంబబదిలచినట్టి వీరాహానుమ ॥ 70

క॥ శమమాదిషట్కవర్గము
శ్రమజెందగ జేయవాటి చర్యలనెల్లన్
క్రమముగబరిమార్చినని
శ్రమధాధిపుడనగవెల్లు భాసురహానుమా॥ 71

క॥ సర్వావస్థలయందున
సర్వస్థితిలయములందు సర్వమునీవై
సర్వాతీతనుమోక్షము
సర్వేచ్ఛలగోరునట్టి సర్వాహానుమా॥ 72

క॥ ఛత్వారిసాధనములను
సత్వరముభజించిరాము సాన్నిధ్యమునన్
ఛత్వారిరహితబోధను
సత్వమునన్ జెందినట్టి సాధుపుహానుమా॥ 73

క॥ శతపత్రంబులమిత్రుని
సతతమునాత్మాంగభావసన్నిధి సేవల్
హితమతితోడనుసల్పిన
పతితుడవనినమ్మినాడ పవనజహనుమాను॥ 74

క॥ దేహాభిమానమాదిగ
కూహకమనజెల్లుయేడు కోటలనెల్లన్
సాహసమునబరిమార్చిన
శ్రీహయరూపావతార శ్రీకరహనుమా। 75

క॥ పంచభూతములసంచును
నెంచియుతత్త్వ త్రిలయము లెరిగియుపిదపన్
యంచితమగుసుజ్ఞానము
గాంచిననీసాటివారి గాననహనుమా॥ 76

క॥ అంబరమునగల్గినయా
తొంబదియారనెడితత్త్వ స్తోమంబెల్లన్
జృంభణమొప్పవిచక్షణ
కంబమునన్ సల్పినట్టి ఘనుడవుహనుమా॥ 77

క॥ జ్ఞానకర్మేంద్రియంబులు
ప్రాణంబులువిషయమాది పదివాయువులున్
మేనుత్రయమునివరప్రస
జ్ఞానంబునుగాంచినట్టి జ్ఞానివిహనుమా॥ 78

క॥ అరివర్గంబుల నాఱిటి
శిరములుబఱిమార్చివేగ స్థిరచిత్తుడవై
పరతత్వం బరసినవి
సరివారలుగలరె దెలియసాహసహనుమా॥ 79

క॥ క్షరమక్షర ద్వయంబుల
పరిశోధించగను క్షరముప్రకృతియనుచున్
నిర్వాతదీప మనదగు
పరమాత్మనుగాంచినావు భళిరాహనుమా॥ 80

క॥ ఈరీతిగాను సాంఖ్యవి
చారముమదిశోధజేసి సంభ్రమమొప్పన్
కూరిమిలో తారకమును
ధీరుడవైగాంచితౌర ధీమతిహనుమా॥ 81

క॥ ఆరుచక్రముల నెల్లను
వారకపరిశోధజేసి వరయోగములన్
ధీరుడవై గాంచిననిను
కోరిభజించుటకువశమె కుంభినిహనుమా॥ 82

క॥ అక్షిద్వయమును భ్రూయుగ
లక్ష్యమునూర్ధ్వముగనిల్పి లావణ్యముగన్
వీక్షింప ఖేచరీయని
యాక్షితిసుత దెల్పుగాదె నిలలోహనుమా॥ 83

క॥ లోచనములు గదలింపక
గోచరమగునాసికాగ్ర గోప్యమును వెసన్
జూచియు సంతసమలరగ
భూచరి సాధించినట్టి పుణ్యుడ హనుమా॥ 84

క॥ కన్నులదృష్టియు సగమును
మన్నగ నాసికముమధ్య భాగుగ మనము మున్
తిన్నగ జొన్పగ జేసియు
చెన్నలరన్ మధ్యముద్ర జెందినహనుమా॥ 85

క॥ ద్వారములారిటి మూసియు
ధీరతలో దృష్టిమనము జేర్చి భ్రూయుగం
బారయక శిలను జూచుచు
వారికి మణ్యుఖనిగన్న వాడవు హనుమా॥ 86

క॥ అర్ధోన్మీలిత దృష్టిని
శ్రేష్ఠగ నాసాగ్రమందు సయ్యననిడిని
ధరశ్రీశాంభవి భావము
ప్రకటితగ గాంచినట్టి శేముషి హనుమా. 87

క॥ గాలముచే మీనంబులు
చాలగు పెన్నురినపక్షి జాతము ధాత్రిన్
శూలంబున మదగజములు
గూలినగతి ఇంద్రియముల గూల్పవె హనుమా. 88

క॥ ఇరువది యొక వెయ్యారును
నూరులునిత్యమునుదిరుగు నుర్వినిహంసన్
వారక పరిశోధించిన
ధీరాని ప్రాపెనాకు దిక్కగుహనుమా. 89

క॥ ఆసన పంచకమెప్పుగ
భాసురమొప్పగనునచట బ్రహోర్గ్రణమా
ధ్యాసగలక్ష్యము చూచుచు
వాసిగ జేయ వెతపంబు వరధాహనుమా. 90

క॥ అష్టాంగ యోగములబల్
కష్టించియుతనువుశోధ గనిముఖమున స్ఫూ
స్పష్టమగు బ్రహ్మ తేజము
శ్రేష్ఠుడవై గాంచినట్టి శ్రీకరహనుమా. 91

క॥ మంత్రలయ హఠములనుబల్
తంత్రుడవై సంతతంబు తాళిమితోడన్
సంతసమొందిన సద్గుణ
వంతా సుజనాళిపోష వరదాహనుమా. 92

క॥ యీరీతి తారకంబును
వారకసాధించివేగ వరదృగ్బ్రహ్మా
కారూఢత జెందిననిను
కోరిభజించుటకువశమె కుంభినిహనుమా. 93

క॥ శుక్తిగ నిరజిత మసినా
సక్తిగ రజ్జువును జూడ సర్పము కరణిన్
నిత్యముగ గాంచు జగమును
సత్యంబన జెల్లదనరె సాధులు హనుమా. 94

క॥ కలలో గాంచు జగములు
కల మేల్కొని జూచినపుడు గన్పడవనుచున్
అల పరిపూర్ణం బరసియు
యిల స్వప్న ముతుల్యమనుచు నెంచవె హనుమా. 95

క॥ బ్రహ్మసభ సన్నిధిన భూ
[illegible]మ్మసుతన్ గాంచి చెలులు యూవకుడితడే
నమ్మాయని బల్కగనూ
నమ్మనక నెచట్లు సాజ్ఞ నాయగ హనుమా. 96

క॥ ధీమంతా రఘువర్యుడు
సారెకు మెరుకౌఘుమెల్ల సాకల్యముగన్
కూరిమిమీరగ దెల్పియు
నూరికి యున్నంత సత్య మెరుగ వె హనుమా. 97

క॥ ఆగామి సంచితంబును
బాగుగ బ్రారబ్ధపంక్తి శరత్రాత్రులకున్
యోగికులే శాలేవని
నీగురుడగు రాముడాజ్ఞ నివ్వడె హనుమా. 98

